THE ANDHRA PATRIKA - MADRAS.

హరిజనాభ్యుదయానికి గాంధీజీ త్యాగం: కాకినాడలో గవర్నరు ఉద్బోధ —6 వ పేజీ

# ఆంధ్రపత్రిక

6 పేజీలు వెల 1 అణా. హాలీ 0-1-2.

ఆంధ్రలో కాంగ్రెస్‌తో సహకారానికి ప్రజాసోషలిస్టుల షరతులు: అశోక్ మెహతా వివరణ —2 వ పేజీ

Regd. No. M. 1118 సంపుటం 39. సంచిక 348 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. మంగళవారము 24-3-1953

# రాష్ట్రంలో నీటివసతుల అభివృద్ధిపట్ల ప్రభుత్వం చూపుతున్న అశ్రద్ధ

## 'సూయజ్ ప్రాంతంలోని బ్రిటిష్ సేనలకు బేషరతు నిష్క్రమణ ఒక్కటే మార్గం'

### ఈ విషయాన్ని బ్రిటనుకు స్పష్టీకరించినట్లు ప్రధాని నజీబ్ పునరుద్ఘాటన

అస్వాన్, మార్చి 22: "ఎట్టి షరతులు లేకుండా సూయజ్ కాలువ ప్రాంతంనుంచి సైన్యాలను ఖాళీచేసుకొని వెళ్లిపోవలసిందని బ్రిటనుకు విస్పష్టంగా చెప్పివేశాను." అని ఈజిప్టు ప్రధానమంత్రి జనరల్ నజీబ్ నేడిచ్చట బహుజన సమావిష్టమైన ఒక మహాసభలో మాట్లాడుతూ స్పష్టంగా ప్రకటించారు.

ఈ సేనల ఉపసంహారాన్ని గూర్చి సమాలోచనలు జరుగుతాయో జరగవో తెలియదు కాని బ్రిటిష్ సేనలు మాత్రం ఇక్కడనుండి వెళ్లిపోయేదిమాత్రం తథ్యం అని ఆయన అన్నారు. తనంతట తానుగా బ్రిటన్ ఇచ్చటనుంచి తన సేనలను కదల్చకపోతే, వాటిని మనం గెంటివేస్తాం. అందుకు ఇప్పుడు సిద్ధంగా వున్నాం అని గూడా జనరల్ నజీబ్ ఈ సందర్భంలో ప్రకటించారు.

భగవంతుడు మనుష్యుల్ని స్వతంత్రులుగా జీవించేందుకు పుట్టించాడు. వారిస్వాతంత్ర్యాన్ని హరించేహక్కు ఎవ్వరికీ లేదు. బ్రిటిష్‌వారు తమ సైన్యాలను ఇచ్చట పెట్టి, మన స్వాతంత్ర్యాన్ని హరించివేశారు. ఆ స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడమో, అందుకోసం చావడమో, ఇది తప్ప ఇక వేరే మార్గం ఏమీ లేదు అని ఆయన ప్రజలకు చెప్పారు.

జనరల్ నజీబ్ ప్రస్తుతం ఎగువ ఈజిప్టులో పర్యటిస్తున్నారు. ఇది 2500 మైళ్ల పర్యటనం. ఈ పర్యటన సందర్భంగా ఆయన అస్వాన్, ఎస్నా మొదలైన ప్రాంతాలను చూచారు. ఈ సందర్భంలో ఆయన ప్రజలకు దేశాభివృద్ధికోసం ప్రభుత్వం చేస్తున్న పనులను, అంతర్జాతీయ రంగంలో తమ పురోభివృద్ధికి అవరోధాలుగా వున్న ఆటంకాలను తొలగించడంకోసం చేస్తున్న కృషిని వివరించారు. అంతర్జాతీయ రంగాల్లో మనం పైకి రాకుండా కొన్ని గోడలు అడ్డం వున్నాయి. వాటిని పడగొట్టి వేయడానికి ప్రతిజ్ఞ పట్టాలి. అందుకోసం ఎటువంటి త్యాగాన్నైనా సరే చేస్తాం అని ఆయన అన్నారు.

### తంతివార్తకు తప్పు అర్థం: తల్లి ఆత్మహత్య

భగల్‌పూర్, మార్చి 22: ఒక తంతివార్తకు అర్థం తప్పు చెప్పినందువల్ల, అది ఒక వ్యక్తి ఆత్మహత్యకు దారితీసింది.

ఈ ఉదంతాన్ని గూర్చిన అసలు విషయాలు ఈవిధంగా వున్నాయి. భగల్‌పూర్‌లో ఒక ప్లీడరుగారు వున్నారు. ఆయన కుమారుడు లండన్‌లో చదువుకుంటున్నారు. పర్మిట్ అయిపోయింది. ఆ విషయం తండ్రికి తెలియజేస్తూ, "నీలాంసుని పర్మిటు అయిపోయింది" అని తంతి ఇచ్చాడు. ఆ కొడుకుపేరు నీలాంసుడు. తండ్రి ఇంట్లో లేనప్పుడు వచ్చిన ఈ టెలిగ్రాము తల్లి ఎవరిచేతో చదివించుకుంది. ఆ మెను పై మాటలు తలకుపట్టక, 'అయిపోయింది' అన్న మాట పట్టి నీలాంసుడిపని అయిపోయిందనుకొని, కొడుకుమొక్క ఈ ఎడబాటును భరించలేనంటూ ఆత్మహత్య చేసుకుంది.

నీలాంశుని తండ్రి ఇంటికి వచ్చేదాకా ఇది ఇట్లా జరిగిందని ఎవరికి తెలియదు.

### 'పగటి వేషాలు'

#### డా॥ శ్యాంప్రసాద్ ముఖర్జీ ప్రకటన

కలకత్తా, మార్చి 22: వేదుస్తుల్లో వున్న పోలీసులు తన్ను ఎప్పుడు వెంటనంటి తిరుగుతు వున్నట్లు జనసంఘ నాయకుడు డా॥ శ్యామప్రసాదముఖర్జీ నేడు ఒక విషయాన్ని బయటపెట్టారు.

కలకత్తాలో ఒక బహిరంగ సభలో మాట్లాడుతూ, ఈ సి.ఐ.డి. వాళ్లు తన ఇంటికి జ్యోతిష్కుల్లాగా, చిప్పగాళ్లలాగా, హస్తసాముద్రికం చెప్పే వాళ్లలాగా, ఇవ్వీ అవ్వీ అమ్మే వాళ్లలాగా వేషాలు కట్టుకువస్తున్నట్లు ఆయన వ్యక్తంచేశారు. మీరు ఒకసారి ఢిల్లీకివచ్చి మా యింటిదగ్గర కూర్చోండి. ఈ పగటివేషాల తంతంతా మీరు హాయిగా చూడవచ్చు అని ఆయన సభవారికి తెలియజెప్పారు.

## పంపుసెట్లు స్వేచ్ఛగా పెట్టుకొనే అనుమతి అసంభవమని మంత్రి ఉద్ఘాటన

### ఇరిగేషన్, భూమిశిస్తు డిమాండ్లపై అసెంబ్లీ చర్చలో సభ్యుల విమర్శ

మదరాసు, మార్చి 23: నేడు అసెంబ్లీలో ప్రశ్నోత్తరములు ముగిసినవెంటనే 1953-54 సంవత్సరం తాలూకు అడ్వాన్సు గ్రాంట్లకు సంబంధించిన డిమాండ్లపై ఓటింగు ప్రారంభమైంది.

ఆర్థికమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యంగారి ప్రతిపాదనపై ఇరిగేషన్, ల్యాండ్ రెవిన్యూ, పోలీసు, విద్య, అడవుల పద్దుల పై వరసగ చర్చ జరగాలని నిర్ణయించారు.

తరువాత పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ నారు రంగారెడ్డి గారు డిమాండ్ నెం 8 రు ఇరిగేషను నిమిత్తం రూ. 1,20,00,000 లకు మించని మొత్తము మంజూరు చేయాలని కోరారు.

శ్రీ బి. లక్ష్మీనరసింహ్వరాజు (నరసపూర్-కమ్యూనిస్టు) కోతను ప్రతిపాదిస్తూ గోదావరి జిల్లావలన ప్రభుత్వానికి పెట్టుబడి తిరిగివచ్చి చాల లాభం వచ్చినను ఇప్పుడు కాల్వలను పెంచుటగాని మరమ్మతు చేయుటగాని జరుగలేదన్నారు. "శబరిమీద రిజర్వాయరు నిర్మించాలి. మురుగుకాల్వలను మరమ్మతు చేయాలి. సకాలంలో మరమ్మతులను కొనసాగించాలి. తంజావూరుజిల్లాలోవలె పశ్చిమ గోదావరి జిల్లాలో కూడా కౌలుదార్ల రక్షణ చట్టమును అమలుజరపాలని" కోరారు.

శ్రీ నారాయణకురుప్ (ఒట్టపాలెం-ప్రజా) ఎక్కువ అరిచేవాళ్లకే లాభం చేయకుండా ప్రాజక్టులు లాంటివాటిని నిర్మాణములను నిష్పక్షపాతముగ అమలుజరపాలని అన్నారు. మేజరు ప్రాజక్టులతోపాటు మైనర్ ఇరిగేషన్ పనులను నిర్వహించాలని కోరారు.

(3 వ పేజీ చూడుడు)

### ఉత్తర టర్కీలో మళ్లీ భూకంపాలు

లండన్, మార్చి 23: ఉత్తర టర్కీలో డార్డనెల్స్ ప్రాంతంలో యింకా భూమి కంపిస్తునేవుంది. నిరాశ్రయులైన జనం బంగరుబయులులో డేరాలలో నివసిస్తున్నారు.

## జయప్రకాశ్‌తో కిద్వాయ్ చర్చ

### రాజకీయ ప్రాధాన్యంకాదని ఆహారమంత్రి ప్రకటన

బొంబాయి, మార్చి 23: కాంగ్రెసు తరఫున ప్రజా సోషలిస్టుపార్టీ వారితో పొత్తుకోసం తాను రాయబారాలు జరుపుతున్నట్లు బలిసిన వదంతులన్నీ అబద్ధాలని కేంద్ర ఆహారమంత్రి రఫీ అహ్మద్ కిద్వాయి నేడొక ప్రకటన చేసారు.

నిన్న శ్రీ కిద్వాయి శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌తో మాట్లాడారు. ఆ సందర్భంలో కాంగ్రెసు అధ్యక్షుని తరఫున మరొక వ్యక్తిగూడా ఈ సమాలోచనలలో పాల్గొన్నట్లు బొంబాయి పత్రికలు కొన్ని వ్రాసాయి. ఈ వ్రాతలు పూర్తిగా అబద్ధ వ్రాతలని శ్రీ కిద్వాయి అన్నారు.

నన్ను గూర్చి పత్రికలు వ్రాస్తున్న వ్రాతలుచూస్తే ఆశ్చర్యం వేస్తున్నది. బొంబాయిలో ఈ పత్రిక ఇట్లా వ్రాసింది: ఢిల్లీలో ఒక పత్రిక నాకు కాంగ్రెస్. పి. ఎస్. పి. పొత్తు ఇష్టంలేదని, అందుచేత నేను దాన్ని ప్రతిఘటిస్తున్నానని వ్రాసింది. ఇందులో ఎంత నిజం వుందో, అందులోను అంతే నిజం వుంది. ఢిల్లీలో కాంగ్రెస్ పి. ఎస్. పి. సమాలోచనలు జరుగుతున్నప్పుడు నేను అట్లా అనుకొని ఆ సమాలోచనలవైపుకే పోలేదు. ఆ సమాలోచనలలో పాల్గొన్న వారిని గూడా ఎవరిని కలుసుకోలేదు అని ఆయన చెప్పారు.

ఇక తాను బొంబాయికి యిటువంటి పనులు వేటిమీద రాలేదని, తన మేనకోడలు పెళ్ళయితే, ఆ పెళ్లికివచ్చానని శ్రీ కిద్వాయి వివరించారు. నేను బొంబాయిలో శ్రీ జయప్రకాశ్‌ను కలుసుకున్నాను. అయితే అందులో రాజకీయ వ్యవహారం ఏమీ లేదు అన్నారు. పి. ఎస్. పి. లో నాకు కూర్చినవారు, సన్నిహితులు చాలామంది వున్నారు. అయితే, పి. ఎస్. పి. అధ్యక్షునికి నేనంటే అనుమానం. ఆయన నన్ను నమ్మరు. అందువల్ల నా మాట ఆయన వింటారనుకోవడంకన్నా పొరపాటు ఇంకొకటి లేదు.

## కాశ్మీర్ సమస్యపై రాజీకి శ్యామప్రసాద్ సంసిద్ధత

### ప్రతిష్ఠకోసం పాకులాడవద్దని నెహ్రూకుసలహా

కలకత్తా, మార్చి 22: "జమ్మూ సమస్యను త్వరగా పరిష్కరించడానికి ప్రతిష్ఠ అడ్డు పడకూడదు. జమ్మూ, కాశ్మీరు సమస్యపై అధికారులతో రాజీ పడడానికి నేను సిద్ధంగా వున్నాను" అని జనసంఘ నాయకుడు శ్యామప్రసాద్ ముఖర్జీ నేడు ఇక్కడ ప్రకటించారు.

ఇక్కడ ఒక బహిరంగ సభలో ఉపన్యసిస్తూ డాక్టరు ముఖర్జీ ఇంకా యిలా అన్నారు: ప్రజా ప్రతినిధి ప్రభుత్వ వ్యవస్థలో సాత్విక నిరోధం వాంఛనీయం కాదు. కాని ఈ సమస్య విషయంలో మా ప్రతిను నెహ్రూ ప్రభుత్వ వ్యవహారవిధానం నిరంకుశ బ్రిటిషు ప్రభుత్వ విధానాన్ని జ్ఞప్తికి తెస్తున్నది. ఈ సమస్యను శాంతియుతంగా పరిష్కారం చేయాలని మేము చేసిన విజ్ఞప్తులన్నీ అరణ్యరోదనాలయినవి. సాత్వికనిరోధం తప్ప మారు అన్యమార్గం లేకపోయింది.

జమ్మూలో ప్రజాపరిషత్తు సాగిస్తున్న ఉద్యమం ఆ రాష్ట్రానికి మాత్రమే సంబంధించినదికాదు. యావద్భారత దేశానికి సంబంధించింది. జమ్మూ, కాశ్మీరు పూర్తిగా భారతదేశములో కలవాలని, భారత రాజ్యాంగం ఆ రాష్ట్రానికి వర్తించాలని మేము కోరుతున్నాము. పరిషత్తు ఉద్యమం న్యాయమైనది. అందువల్ల, ఈ ఉద్యమాన్ని బలపరచాలి.

ప్రభుత్వంవారు గాంధీమహాత్ముని కులకు స్వస్తిచెప్పి లాఠీలు ప్రయోగం చేస్తున్నారు. జమ్మూలో చేసిన అమానుష కార్యాలు చెప్పలేను. జమ్మూ సంఘర్షణలలో 10, 15 మంది కాల్పులలో ప్రభుత్వంవారు చంపేశారు. కాని 30, 40 మంది చనిపోయినట్లు నాకు సమాచారం తెలిసింది.

### జమ్మూ పరిస్థితిపై పార్లమెంటు చర్చ

#### 25-వ తేదీన

కలకత్తా, మార్చి 22: జమ్మూ పరిస్థితినిగూర్చి భారత పార్లమెంటులో మార్చి 25 వ తారీఖునాడు రెండు గంటలపాటు చర్చ జరుగుతుందని డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ నేడిచ్చట వ్యక్తంచేశారు.

మార్చి 27 న తన్నుగూర్చిన విచారణ ప్రారంభం కాకముందు ఏదో ఒక రోజున ఈ సమస్యనుగూర్చి చర్చ జరిపించవలసిందిగా ప్రధాని మంత్రికి తాను వ్రాశానని, ఆయన 25 వ తేదీని అందునిమిత్తం కేటాయిస్తున్నట్లు తనకు ప్రత్యుత్తరం వ్రాశారని ఆయన ఈ సందర్భంలో ప్రకటించారు.

### స్టర్లింగ్ ప్రాంత ఆర్థికాభివృద్ధి కృషి

#### పారిస్‌కు ఈడెన్ ప్రయాణం

లండన్, మార్చి 22: స్టెర్లింగు ప్రాంత ఆర్థిక స్థితిని బాగుపరచడానికి కామన్వెల్తు రాజ్యాలు తయారుచేసిన పథకాన్ని యూరోపియన్ దేశాలకు వివరంగా తెలియజేసే నిమిత్తం, బ్రిటిషు విదేశాంగమంత్రి ఆంథోనీ ఈడెన్ ఈవేళ పారిస్ వెళ్ళారు.

యూరోపియను సైనిక ఒడంబడికలో పాల్గొనే రాజ్యాలతో బ్రిటన్ పెట్టుకో గోరుతున్న అనుబంధం విషయం గురించి కూడా ఈడెన్ ఫ్రెంచి విదేశాంగమంత్రితో చర్చిస్తారు.

యూరోపియను ఆర్థిక సహకారసంస్థ సమావేశానికి ఈడెన్ అధ్యక్షత వహిస్తారు. కోశాధ్యక్షుడు బట్లరుకూడా రేపు పారిస్ వెళ్తారు.

## 'కాశ్మీర్ ఒప్పందం పూర్తి అమలుకు మీ ఆందోళనే అవరోధంగా నిల్చింది'

### హిందూమహాసభ అధ్యక్షుడు ఛటర్జీగారికి ప్రధాని నెహ్రూ లేఖలో హెచ్చరిక

న్యూఢిల్లీ, మార్చి 22: "భారత దేశంతో తమకు సంబంధాలను నిర్ణయించుకోవలసినవారు జమ్మూ, కాశ్మీర్ ప్రజలే. ప్రజల వాంఛలకువిరుద్ధంగా, ఆయుధబలంతో మేము వారిని బలవంతపెట్టదలచడం లేదు. ఏ దేశమూ ఇలా బలవంతపెట్టజాలదు. కనుక ప్రజల సుహృద్భావం ముఖ్యము. ఈ సుహృద్భావమునకు భంగం కలిగించే పనులు మన సంబంధాన్ని దుర్బలం చేస్తవి. ఇట్టి సుహృద్భావం విస్తారంగా లభించింది. ఇందువల్లనే మేము ఆ రాష్ట్రంలో యిట్టిచర్యలు తీసుకున్నాము," అని ప్రధాని పండిత నెహ్రూ హిందూ మహాసభాధ్యక్షుడైన శ్రీ ఎన్. సి. ఛటర్జీగారికి వ్రాసిన లేఖలో తెలుపుతున్నారు.

ఉభయులమధ్య నడిచిన లేఖలను శ్రీ ఛటర్జీగారు నేడు విడుదలచేశారు.

ఛటర్జీకి వ్రాసిన లేఖలో పండిత నెహ్రూ ఇంకా యిలా చెప్పతున్నారు: "జమ్మూ ఆందోళనవల్ల బహుజనుల సుహృద్భావం తగ్గుతుంది. తత్ఫలితంగా ఇండియా జమ్మూ కాశ్మీర్ల మధ్య మనం వాంఛిస్తున్న సన్నిహితసంబంధాలు యేర్పడజాలవు.

భారత ప్రభుత్వమూ జమ్మూ కాశ్మీరు రాష్ట్రము చేసుకున్న ఒప్పందంవల్ల ఆ రాష్ట్రం యిదివరకు కంటె భారతదేశానికిసన్నిహితమైంది. ఈ ఒప్పందం కేవలను మూడు విషయాలకు మాత్రమే సంబంధించినది కాదు. అనేక మార్గాలద్వారా జమ్మూ, కాశ్మీరును భారతదేశంలో కలపడానికి ఈ ఒప్పందం చర్యలు తీసుకున్నది. ఈ కలయిక యితర సంస్థానాల కలయిక అంత సంపూర్ణం కాకపోయినంత మాత్రమున దాని సంపూర్ణత్వము తగ్గదు.

అనేక కారణాలవల్ల జమ్మూ కాశ్మీరులో వ్యవహరించడంలో మనం విలక్షణమైన పద్ధతిని అవలంబించడం అవసరమని నా తలోస్తున్నది. ఇతర సంస్థానాలతో సమంచేయ ప్రయత్నించడంవల్ల మన లక్ష్యానికే భంగం కలుగుతుంది. ఈ ఆందోళన తమ ఆశయాలకే భంగం కలిగిస్తున్నదని ప్రజలు గ్రహించాలి.

ఒప్పందంలో తమకు పరిపడే విషయాలను మాత్రం షేక్ అబ్దుల్లా అమలు చేశాడుగాని, యితర విషయాలను అమలు చేయలేదని మీరంటున్నారు. కాని షేక్ అబ్దుల్లా వాటిని అమలు చేయ ప్రారంభించగానే ఆందోళన ప్రారంభమైందని, ఇంకా వాటిని అమలుచేయడానికి అవరోధం కలిగించిందని మీరు జ్ఞాపకముంచుకోవాలి. ఈ ఆందోళన ప్రారంభం కాకపోయినట్లయితే ఆయన చర్యతీసుకుని వుండేవాడని నేను విశ్వసిస్తున్నాను.

ఆర్థిక సమైక్యం విషయమై వారు ప్రస్తావించారు. ఆర్థిక సంబంధ

(6 వ పేజీ చూడుడు)

### 'అమెరికా సన్నాహాలు విరమించకూడదు'

#### అడ్లాయి స్టీవెన్సన్ అభిప్రాయాలు

హాంకాంగ్, మార్చి 22: స్టాలిన్ మృతి కారణంగా అమెరికా తాను ఇదివరకు నుంచీ చేస్తూ వున్న సన్నాహాలను వేటిని విరమించడం తగదని ఎడ్‌లాయ్ స్టీవెన్‌సన్ నేడిచ్చట అన్నారు.

స్టీవెన్‌సన్ మొన్న అమెరికా అధ్యక్షుని ఎన్నికల్లో డెమోక్రాటిక్ పార్టీ తరఫున పోటీచేసి ఓడిపోయారు. ప్రస్తుతం ప్రపంచ పర్యటన చేస్తూ ఇచ్చటకు వచ్చారు. నేడు పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ, ఏ ప్రభుత్వ విధానాలనుగాని, స్టాలిన్ చావు అన్న ఉదంతం ఆధారంగామారిపోవడం అసహజం అన్నారు.

### ఇజ్రేల్, జోర్డాన్ సరిహద్దు సంఘర్షణలు

తెలవీవ్, మార్చి 21: జోర్డాన్ సరిహద్దును ఉల్లంఘించి ఇజ్రేల్‌లో ప్రవేశించిన రెండు సాయుధ అరబ్ ముఠాలతో ఒక ఇజ్రేల్ సైనిక గస్తీదళం నేటి రాత్రి 90 నిముషాలసేపు పోరాటం జరిపినట్లు ఈ పోరాటంలో, ఒక ఇజ్రేల్ సైనికుడు ఇద్దరు అరబ్బులు గాయపడ్డట్లు, ఈ సరిహద్దు సంఘర్షణలను గురించి యుద్ధవిరమణ కమిషన్‌కు తాను ఫిర్యాదు చేసినట్లు, ఇజ్రేల్ సైనిక ప్రతినిధి ఒకడు నేటిరాత్రి ప్రకటించాడు.

## లండన్‌చర్చల ఫలితప్యం

### బ్రిటిష్‌ప్రధాని చర్చిల్‌కు, మార్షల్ టిటో అభినందన సందేశం

బెల్‌గ్రేడు, మార్చి 22: బ్రిటిష్ ప్రధానితో తాను జరిపిన సమాలోచనలు దిగ్విజయంగా కొనసాగి ఫలవంతాలయినందుకు ధన్యవాదాలుఅర్పిస్తూ మార్షల్ టిటో చర్చిల్‌కు ఒక సందేశాన్ని పంపించారు. తాను బ్రిటన్‌లో వున్న 6 రోజులు ఇచ్చిన ఆతిథ్యంపట్ల ఆనందాన్ని వెల్లడిస్తూ మరో తంతిని బ్రిటిష్ రాణి ఎలిజబెత్తుకు పంపించారు.

మన రెండు దేశాలమధ్య సంబంధాలు అతిసన్నిహితంగా వున్నాయని చెప్పడానికి సంతోషిస్తున్నాను. అదీకాక శాంతి సంరక్షణార్థం మన రెండు దేశాలు భుజములు కలుపుకొని పనిచేయగల్గడం గూడా నాకు సంతృప్తిని కూరుస్తున్నది అని టిటో తాను చర్చిల్‌కు పంపిన తంతిలో అన్నారు.

ఇటువంటి తంతినే ఒక దానిని యుగోస్లావియా విదేశాంగ మంత్రి పోపావిక్ బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఈడెన్‌కు పంపించారు. మన రెండు దేశాల మధ్య స్నేహసంబంధాలు దృఢతరం కావడంలో ప్రపంచ శాంతి సుస్థిరం అవుతున్నది అని ఆయన ఈ తంతిలో అన్నారు.

### టిటో తిరుగుప్రయాణం

లండన్, మార్చి 21: బ్రిటనుకు తన రాకవల్ల ఏ ప్రయోజనం కలుగుతుందని తాను ఆశించాడో ఆ ప్రయోజనం పూర్తిగా సిద్ధించిందనీ, బ్రిటను యుగోస్లావియాల మధ్య సహకారం యూరపులో శాంతిరక్షణకు దోహదకారి కాగలదని తాను దృఢంగా విశ్వసిస్తున్నాననీ, మార్షల్ టిటో యీవేళ లండన్ నుంచి ప్రయాణమై పోయేముందు ప్రకటించారు.

బ్రిటన్ యుగోస్లావియాలకు సంబంధించిన అన్ని సమస్యలమీద సంపూర్ణమైన సమాధానం కుదిరినట్లు ఆయన తెలియజేశారు.

## కృష్ణానదిపై రెగ్యులేటర్ రోడ్డుబ్రిడ్జినిర్మాణం

### —కేంద్ర ఉపమంత్రి సూచన

న్యూఢిల్లీ, మార్చి 23: కృష్ణానదిపై రోడ్ - రెగ్యులేటర్ - బ్రిడ్జి నిర్మించాలన్న విషయం సూత్రప్రాయంగా ఆమోదించామని కేంద్ర రైల్వే రవాణాశాఖ ఉపమంత్రి శ్రీ సి. ఏ. అళగేశన్ మొన్నటిదినం తమతో అన్నారని పార్లమెంటు ఆంధ్ర సభ్యులు తెలియజేస్తున్నారు. ఈ రాయబార వర్గంలో శ్రీయుతులు బి. రాజగోపాలరావు, బి. యస్. మూర్తి, ఎ. రామచంద్రారెడ్డి, ఎ. ఆర్ చౌదరి, కె. గోపాలరావు, కె. రమణారావు, కె. సుబ్బారావు, యమ్. నానాదాస్, ఎ. రామయ్య, యస్. బుచ్చికోటయ్య, యస్. వి. యల్. నరసింహం, వై. ఈశ్వరరెడ్డి గార్లువున్నారు. కేంద్ర, మద్రాసు ప్రభుత్వాల యింజనీర్ల మధ్య సంప్రదింపులు జరుగుతున్నవనీ, మద్రాసు ప్రభుత్వ సూచనలకై చూస్తున్నామనీ, అవి చేరగానే పరిశీలిస్తామనీ మంత్రిగారు అన్నట్లు వీరి ప్రకటనలో తెలియజేస్తూ కేంద్ర ప్రభుత్వానికి పంపవలసిన తమ సూచనలు సంపన్నంచేసినదిగా మద్రాసు ప్రభుత్వాన్ని కోరుతున్నారు.

## సంస్థానాధిపతులకు ఇచ్చిన హామీలు

### మరణసుంకాల బిల్లువల్ల వాటికి భంగం వాటిల్లదని హోంమంత్రి కట్జూ ప్రకటన

జామ్నగర్, మార్చి 22: భారతప్రభుత్వ సంస్థానాల శాఖమంత్రి డా॥ కైలాసనాథ్ కట్జు ఈవేళ యిక్కడ పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తూ, ఆర్థిక సమీకరణ సందర్భంలో యిచ్చివున్న హామీని అనుసరించి, సౌరాష్ట్రంయొక్క ఆర్థిక స్థితిగతులను విచారించడానికి, కేంద్ర ప్రభుత్వం దానికి చేయవలసిన సహాయాన్ని గురించి సిఫార్సులు తయారుచేయడానికి భారతప్రభుత్వం త్వరలో ఒక కమిటీని నియమించదలచినట్లు వెల్లడిచేశారు. సంస్థానాధిపతులకు ఇదివరలో ఇచ్చిన హామీలకు భంగం రానివ్వకూడదని అన్నారు.

ఇండియా పాకిస్తాన్‌లమధ్య పరస్పరం శరణార్థుల గూర్చిన ఒడంబడిక జరిగివుండలేదనే మిషతో పాకిస్తాన్ ప్రభుత్వం బందిపోటు దొంగ ఘూపల్‌ను ఇండియాకు అప్పగించ

(3-వ పేజీ చూడుడు)

### పూనాప్రాంతపు హోదా

బొంబాయి, మార్చి 22: పూనాను 'బి' ప్రాంతంగా హోదా పెంచడానికి భారతరక్షణశాఖవారు నిశ్చయించి తాము అట్లా చేసినట్లు వారు భారత రక్షణశాఖ కార్మికుల ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌కు ఒక ఉత్తరం వ్రాసినట్లు తెలుస్తున్నది.

## కొరియాలోని అమెరికన్ సేనలకు ఆయుధసామగ్రికొరత

### వాన్‌ఫ్లీట్ సాక్ష్యం

వాషింగ్టన్, మార్చి 22: ఒకప్పుడు కొరియాలో మందుగుండుసామాను లేకపోయినందువల్ల తాను సైన్యాలకు తుపాకులను కాల్చవద్దని ఉత్తర్వును జారీచేయవలసివచ్చిందని జనరల్ వాన్‌ఫ్లీటు నేడు అమెరికా సెనేటు సాయుధబలాల సంఘంముందు మాట్లాడుతూ వెలడిచేశారు.

1951 మే నెలలో ఈ ఉదంతం జరిగింది. ఆ రోజుల్లో కొరియాలో మందుగుండు సామానుగిడ్డంగులన్నీ ఖాళీఅయినాయి. ఈ కమిటీముందు మాటాడుతూ, ఈరోజునగూడా మందుగుండు సామాను సరఫరాలు కటకటగానే వుంటున్నట్లు జనరల్ వాన్‌ఫ్లీట్ వ్యక్తంచేశారు.

## గంటల పంచాంగం

శ్రీ విజయ సం॥ చైత్ర శు॥ దశమి
1953 సం॥ మార్చి 24 మంగళవారం
శు॥ దశమి తె 5-57 పుష పౌ 2-47
వర్జ్యం రా 11-45 ల 1-33 వ.
శు॥ ఏకాదశి మార్చి 25 బుధవారం
శు॥ ఏకాదశి 24-0 పుష్య సా 5-40
వర్జ్యం లేదు.

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర
యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవిసేయకునికి పరాయణము
పరమధర్మపథములకెల్లన్.-(మహాభారతము)

శ్రీ విజయ సం॥ చైత్ర శు॥ దశమి
మంగళవారం

## కృషికార్ పార్టీ నిర్ణయం

అసెంబ్లీ ఆంధ్ర కాంగ్రెసు పక్షంలో సంయోగ సభ్యులుగా చేరడానికి తీర్మానించుకున్న కృషికార్ లోక్ పార్టీ నాయకులు, సభ్యులు అభినందనీయులు అరునాలుగా కాంగ్రెసు - కృషికార్ పార్టీ లీనీకరణపై ఇరుపక్షాల మధ్య సంప్రతింపులు జరుగుచుండెను కొన్ని స్వల్ప విషయాలను వదలివేస్తే ముఖ్యాంశాలపై సమాధానం కుదిరినట్లే కన్పించెను. ఆఖరు దశలో ఆ స్వల్ప విషయాలే ప్రధానములై రెండు పక్షాల విలీనీకరణకు ప్రతిబంధకాలైనవి.

గతంలో ఏం జరిగినా, ఏకారణాలవల్ల ఈ సంప్రతింపులు విఫలమైనా, మొన్న ఆదివారం కృషికార్ పార్టీ నిర్ణయ ఫలితంగా ఇకనుంచీ రెండు పక్షాలూ ఎక్కువ సన్నిహితం కావడానికి, రాష్ట్ర సమస్యల పరిష్కారంలో పరస్పరం సహకరించుకుంటూ సమష్టి ప్రయత్నం చేయడానికి అనుకూల పరిస్థితులు ఏర్పడగలవు. కొంతకాలం ఈ విధంగా కలిసి పనిచేయకలిగిం ఉభయులూ తమ అపేక్షలు ఒక్కటేనని, వాటిని సాధించుటకు అనుసరింపతగిన మార్గం ఒక్కటేనని గ్రహించగలరు. అప్పుడు రెండుపక్షాల విలీనీకరణ సుసాధ్యం.

కృషికార్ లోక్ పార్టీకిగాని, ప్రజా సోషలిస్టు పార్టీకిగాని కాంగ్రెసుతో ఆదర్శాలు, లక్ష్యాలు సంబంధించినంతవరకు పేచీ లేదు. ఈ మూడు పక్షాలకూ ప్రజాస్వామికము నందు ప్రజాస్వామిక పద్ధతులందు సంపూర్ణమైన విశ్వాసం వుంది దేశంలో ప్రజాస్వామిక వ్యవస్థను సుస్థిరంచేసి, సుస్థిర ప్రజాస్వామిక వ్యవస్థకు ప్రమాదం సంభవించకుండా అవసరమైన కట్టుదిట్టములు చేయడం ఈ పార్టీల విధ్యుక్తధర్మం.

ఈ పార్టీల నాయకులు తమ విధిని గ్రహించినందువల్ల పరస్పర సహకారం సులభం కాగలదు. పండిట్ నెహ్రూ, జయప్రకాశనారాయణ్ సంప్రతింపుల పర్యవసానం ఎలా వున్నప్పటికీ ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించి ఎంతవరకు బొంబయిలో సమావేశమౌతున్న ప్రజాసోషలిస్టు కార్యవర్గం రాష్ట్ర పరిస్థితులు దృష్ట్యా ఉచితమైన నిర్ణయాన్ని చేయవలసియున్నది. ఆంధ్ర రాష్ట్రంలో ఏ రెండు పార్టీలు చేరి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయలేవు. కాంగ్రెసు - కమ్యూనిస్టు సంయోగం అసంభవం గనుక కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు, కృషికార్ పార్టీలు, కొందరు స్వతంత్రులు కలిసినగాని, సుస్థిర ప్రభుత్వస్థాపన సాధ్యం గాదు. కృషికార్ లోక్ పార్టీ వలెనే ప్రజా సోషలిస్టులు, స్వతంత్రులు కాంగ్రెసు పక్ష సంయోగ సభ్యత్వాన్ని స్వీకరించిన ప్రభుత్వస్థాపన సుకరమవడమేగాక, అట్టి ప్రభుత్వం సుస్థిరంగా వుండి నూత్న రాష్ట్రాభివృద్ధిసాధనకు మరొక ఆలోచన లేకుండా దీక్షతో పనిచేయుగలదు. ప్రజాసోషలిస్టు పార్టీ సభ్యులు, ఆపార్టీలో చేరలేకపోయిన ప్రజా పార్టీ సభ్యులు, స్వతంత్రులు కూడా శాసనసభ ఆంధ్ర కాంగ్రెసు పార్టీలో 'సంయోగ' సభ్యులుగా చేరి నూత్న రాష్ట్ర సర్వాభివృద్ధికి కృషి చేయుదురు గాక!

ప్రదేశ కాంగ్రెసు కార్యవర్గం, ప్రజా సోషలిస్టుపార్టీకి చెందిన అసెంబ్లీ సభ్యులు రాజీనామాలు ఇవ్వడంవల్ల ఏర్పడిన ఖాళీలకు అభ్యర్థులను నిలపక పోవడంలో గొప్ప రాజనీతిజ్ఞతను ప్రదర్శించినది. ప్రజా సోషలిస్టుపార్టీ నాయకుడు ప్రకాశం పంతులుగారున్నూ, అసెంబ్లీలోని ఆంధ్ర స్వతంత్ర సభ్యులున్నూ కాంగ్రెస్‌పార్టీ నాయకుని విజ్ఞప్తికి సుముఖంగానే వున్నట్లు కన్పిస్తుంది. అయితే ఈ పరిస్థితులలో రాజధాని విషయంలో కొందరు వివిధవర్గాల మధ్య అభిప్రాయ భేదాలను కల్పించడానికి ప్రయత్నిస్తున్నట్లు కన్పిస్తున్నది. రాష్ట్రంలోని ప్రజాస్వామిక పక్షాలన్నీ ఎందు నిమిత్తం కలిసి పనిచేయ నిశ్చయించుకున్నవో ఆ లక్ష్యం సిద్ధింపక ముందునుంచే ఇట్టి ప్రయత్నాలకు పూనుకోవడం శోచనీయం. కలసి పనిచేయుదానికి తీర్మానించుకొన్న తరువాత ప్రతి విషయంమీదా కలిసే నిర్ణయాలు చేయడం అవసరం. ఎవరికి వారు నిర్ణయాలు చేసుకుని ఇతరులు ఆ నిర్ణయాలను ఆమోదించాలని పట్టుబట్టుతూవున్న ఈ ఐకమత్యం, ఈ సంయోగం ఎంతో కాలం నిలవదు. వీటిని సాధించదానికి స్వదు చేసిన త్యాగం నిరర్థకమౌతుంది ఆంధ్రులందరికీ సంబంధించిన రాజధాని మొదలైన ముఖ్య సమస్యలపై ఎవరికి వారుగా నిర్ణయాలు చేయడం విరమించి అందరూ చేరే, అందరి శ్రేయస్సు దృష్ట్యా సర్వజనాంగీకారం కాగల నిర్ణయానికి రావడం ఈ ప్రారంభదశలో, రాష్ట్రావతరణ సమయంలో అవసరమని మరోకసారి విజ్ఞప్తి చేస్తున్నాం.

## ఆంధ్రులు - ఆంధ్ర రాష్ట్రము - రాజాజీ

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు ఇటీవల తమ ఉపన్యాసాల్లో ఆంధ్రరాష్ట్ర వ్యవహారాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. రాష్ట్రశాసనసభల్లో గవర్నరు ప్రసంగంమీదా, బడ్జెట్‌మీద జరిగిన చర్చలో ఆంధ్ర, తమిళ సభ్యులు మధ్య రాను విభజన వ్యవహారాన్నే ఎక్కువగా, ప్రధానాంశంగా ప్రస్తావించడం జరిగింది ఆంధ్ర ప్రతినిధులు తమిళ నాయకులపై ఆరోపణలు చేయడం, తమిళ ప్రతినిధులు ఆంధ్రనాయకులపై ఆరోపణలు చేయడం వల్ల శాసనసభ వాతావరణంకొంత ఉద్రిక్తం కావడం జరిగింది. ఈ పరిస్థితులకు కారణభూతులైన వారిని ఎవరినీ మేము సమర్థింప లేము. అయితే ఒక్క విషయాన్ని మాత్రం, అది ఎవరికి అప్రియమైనప్పటికీ, స్పష్టం చేయక తప్పదు. ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని మూడు సంవత్సరాల పాటయినా మద్రాసులో వుండటం అవసరమని న్యాయమూర్తి వాంఛూగారు సూచించారు. ఈ సూచన న్యాయసమ్మతంగానూ, ధర్మబద్ధంగానూ వున్నదని, ఆంధ్రులు, తమిళులు కానివారందరూ అంగీకరింపగలరు. ఈ విధమైన సూచనను తిరస్కరించి, బెదిరింపులతో తమిళ నాయకులు కేంద్ర ప్రభుత్వ మనస్సును కూడా మార్చడంవల్ల ఆంధ్రులలో శ్రీ రాజగోపాలాచారి ప్రభృతులపై తీవ్ర అసంతృప్తి కలిగినది.

శ్రీ రాజగోపాలాచారిగారు తాము ఆంధ్రుల క్షేమందృష్ట్యానె తాత్కాలికంగా కూడా ఆంధ్ర రాజధాని మద్రాసులో వుండరాదని పట్టుబట్టినట్లు చెప్పారు. ఆంధ్రులకు తాము ఈ విషయంలోనేగాక ఎప్పుడూ ఏ విషయంలోనూ అన్యాయం చేయలేదన్నారు. తమ న్యాయగుణాన్ని నిరూపించడానికి శ్రీ రాజగోపాలాచారిగారు గత ముప్ఫయి సంవత్సరాల రాష్ట్ర పరిపాలనా చరిత్రను సమీక్షించారు. తమ నిష్కాపట్యమే ఇతరులకు అప్రియమైనదని, భాషా రాష్ట్రాల విషయంలో తమ అభిప్రాయాలు ఆంధ్రులకు కష్టంకల్గింపవచ్చునని చెప్పారు.

ఆంధ్రులు రాజగోపాలాచారిగారంతటి సమర్థులు కాకపోవచ్చును. అంతటి 'రాజనీతి చతురత' ఆంధ్రులకు లేకపోవచ్చును. అంతటి కార్యదక్షత, పట్టుదల ఆంధ్రులలో లోపింపవచ్చును. కాని వారికి ఏది మంచో వారు తెలుసుకోగలరు. ఆమాత్రపు ఇంగితజ్ఞానం ఆంధ్రులకు ఉన్నదని రాజగోపాలాచారిగారు అంగీకరించాలి. కాని వారు అంగీకరింపరు! ఇంతవరకు అంగీకరించలేదు, కనుకనే వారు ఆంధ్రులు తమ రాజధానిని ఎక్కడ ఏర్పాటుచేసుకోవాలన్న విషయంలోనేగాక, ఎవర్ని నాయకునిగా ఎన్నుకోవాలో కూడా సూచిస్తూ వచ్చారు. ఇట్టి ప్రమేయాన్ని ఆంధ్రులేగారు ఎవ్వరూ సహింపరు. ఏడెనిమిది సంవత్సరాల క్రితం శాసనసభల కాంగ్రెస్‌పార్టీ నాయకుని ఎన్నిక సందర్భంలో జరిగిన సంఘటనలే రాష్ట్ర రాజకీయాలను ఈస్థితికి తెచ్చినవి. ఆనాటి సంఘటనల దుష్ఫలితాలనే ఆంధ్రులు ఈనాటికీ అనుభవిస్తున్నారు. గతాన్ని మరచి ఐకమత్యంతో ఆంధ్రులు తమ రాష్ట్రాన్ని అభివృద్ధి చేయుదానికి కృషి చేయగల అవకాశం ఏర్పడినప్పుడు ఆంధ్రుల శ్రేయోభివృద్ధిని కాంక్షించే వారెవరైనా ఆ కృషి ఫలప్రదం కావడానికి సహాయపడాలి. మాకు తెలిసినంత వరకు రాజగోపాలాచారిగారు ఇప్పటికీ అట్టి సహాయం చేసినట్లు కన్పించదు.

ఇక ఆంధ్రరాష్ట్ర కోరిక విషయమై వారు 1953 మార్చిలో వెల్లడించిన అభిప్రాయాలు ఎవరికైనా వికటంగా కన్పించకతప్పదు. అధికారం కొరకూ, ఉద్యోగాల కొరకూ ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతున్నారని ఇదివరకు రాజగోపాలాచారిగారు ఎంత ప్రచారంచేసినా, నమ్మేవారెవ్వరూ వుండరు. భాషారాష్ట్రాల సమస్యను మోతీలాల్ నెహ్రూ వంటి ప్రముఖనాయకులు పరిశీలించి భాషారాష్ట్ర వాంఛను సానుభూతితో విచారించాలని, భాషాప్రయుక్తరాష్ట్రాలు పరిపాలనా సౌలభ్యానికి దోహదం చేయగలవని అభిప్రాయపడ్డారు.

ఇప్పుడు రాజగోపాలాచారిగారు భాషారాష్ట్ర వాంఛ ఆటవిక మనఃప్రవృత్తి, జనితమని అభివర్ణించి లాభంలేదు. ప్రధానమంత్రి నెహ్రూ కూడా ఈ విధమైన రాష్ట్రాల నిర్మాణానికి విముఖులే. అయినా "ఆంధ్రప్రజలు కోరుతున్నారు గనుక ఆంధ్రరాష్ట్ర స్థాపనకు" అంగీకరించారు. ప్రజాస్వామికంలో విశ్వాసంగలవారెవరైనా చేయవలసినది అంతే రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు కూడా అదే విధంగా ఆంధ్రరాష్ట్ర స్థాపనకు అంగీకరించి తమ సామర్థ్యాన్ని, ప్రతిభను ఈ కార్యక్రమ సాఫల్యానికి వినియోగించాలని కోరుతున్నాం మతాధారంగా దేశ విభజనకు ప్రతిపాదనలు తయారుచేసిన రాజగోపాలాచారిగారు భాష, సంస్కృతి ఆధారంగా రాష్ట్రాల నిర్మాణాన్ని ప్రతిఘటించరనే ఆశిస్తున్నాం.

తాత్కాలిక రాజధానిని ఆంధ్రరాష్ట్రంలోపలె ఏర్పాటు చేసుకొనడానికి ఆంధ్ర నాయకులు ఉద్యుక్తులౌతున్నారు. కనుక ఆంధ్ర, తమిళ నాయకుల మధ్య స్పర్ధలకు ఇక అవకాశం లేదు. రాష్ట్రావతరణ సమయంసన్నిహితమౌతున్నది. గనుక నాయకులు ప్రసంగాలు మాని యావత్తు విభజన వ్యవహారాన్ని సుహృద్భావంతో పరిష్కరించడానికి పూనుకోవాలి. అదే అందరికీ శ్రేయస్కరం.

# కాంగ్రెసుతో ప్రజాపార్టీ కలయికకు షరతు

## 14 సూత్రాలకుసమ్మతిస్తేనేఆంధ్రదేశంలోనైనా 'కొయలిషన్' సంభవమని అశోక మెహతా

బొంబాయి, మార్చి 22: ప్రజాసోషలిస్టుపార్టీ వారి 14 అంశాలకార్యక్రమాన్ని కాంగ్రెసు అంగీకరిస్తేనే గాని, ఈ రెండుపక్షాలూ ఆంధ్ర దేశంలోగూడా కలవడానికి వీలు లేదని ప్రజాసోషలిస్టుపార్టీ కార్యదర్శి శ్రీ అశోక్ మెహతా నేడు యిక్కడ యు పి ఐ విలేఖరితో ముచ్చటిస్తుఅన్నాడు.

"మా షరతులక్కలు చూపాము. శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌గారు ఒక కార్యక్రమాన్ని ప్రధానికి నివేదించారు. ఈ ప్రాతిపదిక మినహా మరే ప్రాతిపదిక మీదా ప్రజా సోషలిస్టు పార్టీ కాంగ్రెసుతో రాయబారాలు సాగించదు. ఇది నా స్వకీయాభిప్రాయాలు. ఇక్కడ రేపు సమావేశమవుతున్న ప్రజా సోషలిస్టుపార్టీ కార్యవర్గంవారు ఈ విషయాల నన్నిటినీ కూలంకషంగా చర్చిస్తారు.

ఉభయులూ అంగీకరించిన ప్రాతిపదికపై మిశ్రమ ప్రభుత్వం యేర్పడ వీలయితే, ఉభయులు కలిసి పనిచేసే ప్రయత్నం జయప్రదమైతే కాంగ్రెసు, మా పార్టీ ఒకే టిక్కెట్టుపై వచ్చే ఎన్నికలలో పోటీ చేస్తవి."

### కార్యవర్గ సభలో ఆంధ్రరాష్ట్రానికి ప్రాముఖ్యం

రేపు యిక్కడ జరిగే ప్రజా సోషలిస్టుపార్టీ సభ యితర ముఖ్యవిషయాలతోబాటు భూదానయజ్ఞం యేలా సాగుతున్నది? అనే విషయాన్ని, ఈ యజ్ఞంలో పార్టీ చురుకుగా పాల్గొనే అవకాశాన్ని గూర్చి చర్చిస్తుంది.

కార్యక్రమ పట్టికలో శ్రీ జయప్రకాశ్ నారాయణ్ సంభాషణలకు సంబంధించిన నివేదిక అగ్రస్థానం ఆక్రమిస్తున్నది. ఆంధ్రరాష్ట్ర స్థాపనకు సంబంధించిన నివేదిక రెండవస్థానం ఆక్రమిస్తున్నది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విషయమై శ్రీ ప్రకాశంగారు సభవారికి తెలుపుతారు. ట్రేడ్ యూనియన్ ఐక్యం విషయమై నివేదిక, నిరుద్యోగము, జమ్మూ ఆందోళన, పెప్సూలో ఎన్నికలు జరిగే అవకాశంపై విచారణ కార్యక్రమ పట్టికలో వున్నాయి.

ఈ కార్యవర్గసభలో సభ్యులు 22 శ్రీ జయప్రకాశ్ నారాయణ్, శ్రీ ఎస్. బెనర్జీ (బెంగాలు) యిక్కడ వున్నారు. తక్కినవారు రేపు వస్తారు.

ఇది యిల్లా వుండగా తనవన్నూ యూనియన్ ఆహారశాఖమంత్రి కిద్వాయికిన్నీ మధ్య కాంగ్రెస్-ప్రజాసోషలిస్టు కొయిలిషను విషయమై జరిగిన సంభాషణలను గూర్చి సంగతులు వలికినట్లు శ్రీ జయప్రకాశ్ నారాయణ్ నిరాకరించారు.

## బొంబయికి ప్రకాశంపంతులుగారి ప్రయాణం

మద్రాసు, మార్చి 23: టంగుటూరి ప్రకాశంపంతులుగారు యివాళ ఉదయం విమానంలో ప్రజాసోషలిస్టుపక్ష కేంద్ర కార్యవర్గ సమావేశానికి హాజరవడానికి వెళ్లారు. కాంగ్రెసు-ప్రజాసోషలిస్టుపక్షాల ముఖ్య రాయబారాలు అఖిల భారత స్థాయిన నిలుపుదల చేయబడినా, ఆంధ్రరాష్ట్రంలోని పరిస్థితులు ప్రత్యేకమైనవనీ, ప్రజాస్వామ్య పక్షములు ఏకమై సుస్థిర ప్రభుత్వ స్థాపనకు తోడ్పడవలసి ఉంటుందని పంతులుగారు బొంబై కార్యవర్గంలో తెలుపగలరని వారి అంతరంగికులు తెలుపుతున్నారు. ఆంధ్రరాష్ట్రనిర్మాణ సందర్భంలో రాజీనామా, ప్రజాసోషలిస్టు శాసన సభ్యులు రాజీనామా యిచ్చిన స్థానాలకు కాంగ్రెసు పోటీ పెట్టకుండా చూపిన సుహృద్భావానికి ప్రజాసోషలిస్టువర్గాలవారు తమ హర్షాన్ని వెలిబుచ్చుతున్నారు. ఈ రెండు పక్షాలకు ఇంకా ముందు బలవత్తర సహకారం ఏర్పడటానికి ఇది ప్రాతిపదిక కాగలదని వారు అంటున్నారు. అఖిల భారత కాంగ్రెసు తమ చతుర్దశ సూత్ర ప్రణాళికను అంగీకరిస్తేనేగాని ఆంధ్ర రాష్ట్రంలో కూడా సహకారం కూడదని ప్రజాసోషలిస్టుపక్ష కార్యదర్శి అశోక మెహతాగారు చెప్పినది వారు చెప్పినటుల అది వారి వ్యక్తిగతాభిప్రాయమేననీ, ఆంధ్ర రాష్ట్రంలో ప్రజాస్వామ్య పక్షాలు ఏకమై సుస్థిర ప్రభుత్వ స్థాపనకు ఏకంగా పనిచెయ్యడం తప్ప వేరు శరణ్యంలేదని ప్రజాసోషలిస్టు నాయకులు అభిప్రాయపడుతున్నారు.

## అలహాబాదు ఉపాధ్యాయుల సమ్మె

### 2 రోజులు జరుపుటకు 1000 మంది నిర్ణయం

అలహాబాదు, మార్చి 22: జీతబత్తాల హెచ్చుదలకోసం అలహాబాదు జిల్లా బోర్డుకు చెందిన ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులు వెయ్యిమంది ఈ వేళ సమ్మెచేశారు. ఈ సమ్మె రెండు రోజులు జరుగుతుంది.

### లక్నోలో అరెస్టులు

లక్నో, మార్చి 22: నిషేధాజ్ఞ నుల్లంఘించి కౌన్సిలుభవన ప్రాంగణంలో గుమిగూడినందుకుగాను 63 గ్గురు ఉపాధ్యాయులు ఈ వేళ ఇక్కడ అరెస్టు చేయబడ్డారు. ఇక్కడ ఉపాధ్యాయులు కొన్ని రోజులుగా జీతబత్తాలను పెంచవలసిందని ఆందోళన జరుపుతున్నారు. ఈ సందర్భంగా ఈ నగరంలో ఇంతవరకు మొత్తం 310 మంది ఉపాధ్యాయులు అరెస్టు చేయబడ్డారు.

# జాతీయ భాషగా హిందీ వ్యాప్తికి చేయదగిన కృషి

## గాడ్గిల్ గారి ప్రత్యేక పథకం

న్యూఢిల్లీ, మార్చి 22: రాజ్యాంగంలో నిర్దేశించబడిన ప్రకారం యింకా 13 ఏళ్లలో హిందీని జాతీయభాషగా దేశంఅంతటా ప్రచారంలోకి తేవడానికి పార్లమెంటుసభ్యులు శ్రీ ఎన్. వి. గాడ్గిలు ఈవేళ ఒక పథకం ప్రతిపాదించారు. ఈ పథకం రెండుభాగాలుగా వుంది. కేంద్రప్రభుత్వోద్యోగులకు సంబంధించిన భాగం ఒకటి. తక్కినప్రజకు సంబంధించింది ఒకటి.

మొదటి భాగంలోని అంశాలు ఇవి: 1953 జూన్ 1 వ తేదీనుంచి 6 నెలల లోపల కేంద్రప్రభుత్వోద్యోగులంతా దేవనాగరీ అక్షరాలను చదవటం నేర్చుకోవాలి. ఆ తర్వాత ఇంకో 3 ఏళ్లలో ప్రవేశ పరీక్ష యివ్వడానికి చాలినంత హిందీ పరిజ్ఞానాన్ని సంపాదించాలి. పిమ్మట అయిదేళ్లలో హిందీలో వుత్తర ప్రత్యుత్తరాలను నడపడానికి సంభాషణ సాగించడానికి కావలసిన పాండిత్యం సంపాదించాలి.

ఇక్కడికి 8½ ఏళ్లు గడుస్తాయి. మిగిలిన 4½ సంవత్సరాలలో కేంద్ర ప్రభుత్వోద్యోగుల భాషా పాటవాన్ని పరిజ్ఞానాన్ని చక్కగా వృద్ధిచేయవచ్చు 1953 జూన్ 1 వ తేదీ తర్వాత కేంద్రప్రభుత్వంకింద ఉద్యోగంగా ప్రవేశించే ప్రతివ్యక్తి హిందీ పరీక్ష ఒకటి పాసు కావాలని నియమం విధించాలి. ఆ పరీక్ష పాసైతే గాని ఉద్యోగం ఖాయం చెయ్యకూడదు.

ఇక ప్రజాసామాన్యానికి హిందీని నేర్పడానికి ఆయన చేసిన సూచనలు యివి: అయిదవ తరగతినుంచి 11 వ తరగతివరకు అనగా 6 ఏళ్లపాటు ప్రతి విద్యార్థికి హిందీ నిర్బంధంగా నేర్పాలి. మాధ్యమికదశలో యితర విషయాలతోపాటు విద్యార్థి సంస్కృతంగాని ఇంగ్లీషుగాని నేర్చుకోవాలి. విశ్వవిద్యాలయాలలో ప్రాంతీయ భాష ద్వారానే విద్యాబోధన జరగాలి; కాగా ప్రతి విద్యార్థి అతడు చదివే ప్రధాన విషయాలలో చేకాక అదనంగా హిందీలోగాని ఇంగ్లీషులోగాని పరీక్ష యివ్వాలి.

వచ్చే 7 ఏళ్లలో భారత ప్రభుత్వం హిందీలో సమగ్రమైన సాంకేతిక పదకోశం ఒకటి తయారు చేయించాలి.

## సింధు మాజీమంత్రి అవినీతి ప్రవర్తన

### కరాచీ పౌరుల దరఖాస్తుపై గవర్నర్ నిర్ణయం

కరాచీ, మార్చి 22: సింధు మాజీ రెవెన్యూమంత్రి మీర్ గులామ్ అలీతాల్పూరు హేయంగా ప్రవర్తించినట్లు, తన ఉద్యోగధర్మమును సరిగా నిర్వర్తించనట్లు నిదర్శనాలు కనిపిస్తున్నవని సింధు గవర్నరు నేడు ప్రకటించారు.

తాల్పూరుకు కోర్టులో విచారణ జరుగుతుందని దీని అర్థమైనట్లు అభిజ్ఞవర్గాలవారు వ్యాఖ్యానిస్తున్నారు.

1951 సం॥ డిసెంబరులో సింధు పౌరులు పెట్టిన దరఖాస్తుపై గవర్నరు ఈ నిర్ణయం చేశారు.

1951 సం॥ చరమ భాగంలో 5 గురు సింధు మంత్రులలో నలుగురిపై యిట్టి ఆరోపణలు జరిగాయి. ఈ ఆరోపణల నువిచారించడానికి ఒక ప్రత్యేక సంఘాన్ని నియమించారు. ఈ సంఘనిర్ణయముల ననుసరించి యిద్దరు మంత్రులు ఒకరు 6 ఏండ్లవరకు, మరొకరు 4 ఏండ్లవరకు ఉద్యోగాలకుగాని, ఎన్నిక పదవులకుగాని అర్హులు కారని తీర్పు చేయడమైంది. తాల్పూరు కోర్టు లోవిచారించబడుతున్నారు. నాలుగవ మంత్రిపైకూడా ఆరోపణలు జరిగాయి. అతని విషయమై గవర్నరు యింకా నిర్ణయం చేయలేదు. ఐదో మంత్రిపై యెవ్వరూ దరఖాస్తు పెట్టలేదు. అతడు యిప్పుడు స్పెయినులో పాకిస్థాను రాయబారిగా వున్నారు.

ఈదరఖాస్తులు రాగానే సింధులో గవర్నరు పరిపాలనను ప్రకటించారు. ఇప్పటికీకూడా సింధులో గవర్నరు పరిపాలనే సాగుతున్నది.

ఇది యిలా వుండగా సింధులో మే మాసమున జనరల్ ఎన్నికలు జరుగుతాయని పాకిస్థాన్ ప్రధాని ప్రకటనలు చేస్తున్నారు. ముగ్గురు మాజీ మంత్రులు పదభ్రష్టులవడంతో సింధు ముఖ్యమంత్రి యెవరవుతారో చెప్పడం కష్టము.

## అమెరికా, కెనడాల్లో రాధాకృష్ణ పర్యటన

### మే 14 తర్వాత ప్యారిస్‌నుంచి ప్రయాణం

న్యూఢిల్లీ, మార్చి 23: భారత ఉపాధ్యక్షుడు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ ఈసారి ప్రపంచ పర్యటనకు పూనుకున్న సందర్భంలో అమెరికాలో ఒక నెలరోజులపాటు గడుపుతారు.

మే 14 న పారిస్‌లో సమితి విద్యావిజ్ఞానసంఘ సమావేశం జరుగుతుంది. దానికి ఆయన అధ్యక్షత వహిస్తారు. అది పూర్తిచేసుకొని మే 19 వ తేదీనాడు వాషింగ్టన్‌కు పోయి మూడు రోజులపాటు వుండివస్తారు.

ఆ అనంతరం ఆయన కెనడాకు వెళ్లి, జూన్ 2 వరకు అక్కడవుండి, ఆ తేదీనాడే తిరిగి అమెరికాకు వస్తారు. అదిమొదలు అమెరికన్ విశ్వవిద్యాలయాలలో ఆయన ఉపన్యాసాలు జూలై 2 దాకా సాగుతాయి.

ఆయనను అమెరికాకు రావలసిందని మెనిసోటా విశ్వవిద్యాలయం ఆహ్వానించింది. ఈ సందర్భంగానే ఆయన అమెరికాకు పోతున్నారు. అయినా ఆయన ఈ అవకాశంలో వీలుచేసుకొని అమెరికా అధ్యక్షుడు ఐజన్ హోవర్‌ను, విదేశాంగ మంత్రి జాన్ ఫాస్టర్ డల్లెస్‌ను, కలుసుకుంటారు.

అమెరికాలో ఈ పర్యటన ముగిసిన అనంతరం ఆయన యిరోపాలో బ్రిటన్ హాలండ్, బెల్జియం, ఆస్ట్రియా, ఇటలీ, యుగోస్లావియాలలో పర్యటించి జూలై 28 నాటికి ఇండియా చేరుకుంటారు.

### రెండు జపాన్ నౌకలపై దాడి

టోకియో, మార్చి 22: సముద్రంలో చేపలు పడుతున్న రెండు జపాను పడవలపై దక్షిణ కొరియా నౌకాదళం దాడిచేసి నాటిని స్వాధీన పరుచుకొన్నట్లు తెలుస్తున్నది.

## గ్రీకు ప్రభుత్వంపై అల్బేనియా ఫిర్యాదు

లండన్, మార్చి 22: అల్బేనియా సరిహద్దులపై గ్రీసు ప్రభుత్వం జరుపుతున్న దురాక్రమణ చర్యలను అరికట్టవలసిందిగా విజ్ఞప్తిచేస్తూ, అల్బేనియా విదేశాంగమంత్రి ఐకరాజ్య సమితికి ఈ తీగం పంపినట్లు అల్బేనియా వార్తా సంస్థ ఈ వేళ ప్రకటించింది.

జనవరి 1 వ తేదీన తిర్నాశ మద్ది ఫిబ్రవరి 11 వ తేదీన గ్రీసు సైనికులు కొందరు [illegible] అల్బేనియన్ సైనికులపై దాడిచేసినట్లు ఆయన ఆ లేఖలో ఆరోపించాడు.

### లాహోరుకు నాజిముద్దీన్ ప్రయాణము

కరాచీ, మార్చి 22: పాకిస్థాన్ ప్రధాని ఖ్వాజానాజిముద్దీన్ దేశాంగ మంత్రి, రక్షణశాఖమంత్రి, రక్షణశాఖ కార్యదర్శులతో సహా లాహోరుకు బయలుదేరి వెళ్ళారు. లాహోరులో యెంతకాలము సైనికపరిపాలన సాగించాలి? అనే విషయాన్ని ఆయన లాహోరు ప్రధాని సైనికాధికారి మేజర్ జనరల్ అజంఖానుతో చర్చిస్తారు.

### రావల్‌పిండిలో 26 గురి అరెస్టు

అమృతసరము, మార్చి 22: అహమ్మదీయ ప్రతికూల ఆందోళన సందర్భమున నేడు రావల్‌పిండిలో 26 గురు అరెస్టయినట్లు రేడియో పాకిస్థాన్ నేటి రాత్రి ప్రకటించింది. ఇదివరకే ప్రకటించినట్లు రావల్‌పిండిలో రాత్రి 10 నుంచి ఉదయము 4 గంటలవరకు కర్ఫ్యూ అమలులో వుంటుందని కూడా రేడియో ప్రకటించింది.

## మావ్ సేటుంగ్ మాస్కో ప్రయాణం

### రష్యాను ఎక్కువ ఆయుధ సహాయం కోరే సూచన

లండన్, మార్చి 22: చైనా కమ్యూనిస్టు నాయకుడు రష్యానుండి ఎక్కువ ఆయుధ సహాయాన్ని అర్థించడానికి త్వరలోనే మాస్కోకు పోనున్నట్లు టోక్యోలోని లండన్ టైమ్సు పత్రిక విలేఖరి వ్రాస్తున్నారు.

ఈ రెండు రకాల సహాయాన్ని ఎక్కువ చేయవలసివున్న అవసరాన్ని గూర్చి రష్యా ప్రభుత్వంతో రష్యా నూతనాధినేత మాలెంకోవ్‌తో మావ్ సేటుంగ్ చర్చించగలడని తెలుస్తున్నట్లు ఈ విలేఖరి వ్రాశాడు.

### కెన్యాలో అరెస్టులు

నైరోబి, మార్చి 22: కెన్యా పోలీసులు పోలీసులు ఫ్రుహ్యాన్సీ ప్రాంతంలో ఈ వేళ 2,500 మందికిపైగా కికియూలను అరెస్టు చేశారు.

ఇక్కడ [illegible] కికియూలు [illegible] ఆంక్షల మేర గాలిస్తున్నారు.

# తూర్పు బెంగాల్‌లోని హిందువుల పరిస్థితి: హైకమిషనర్ వివరణ

కలకత్తా, మార్చి 22: తూర్పు బెంగాలులో అల్పసంఖ్యాక వర్గాలైన హిందువులను పాకిస్థానులోని భారత హైకమిషనర్ డా॥ మోహన్‌సింగ్ మెహతా మూడు రకాలుగా విభజించారు. 'కొంతమంది చాలా ఖిన్నులుగాను, నిరాశాపూరితులుగానూ వున్నారు. పరిస్థితులు అనుకూలమవుతవని వీరు భావించడంలేదు. ఇంకా కొంతమంది భారీ రొత్తున తమ్ము బాధించే వాతావరణము, సంఘర్షణలు జరిగే వాతావరణము యిప్పుడు లేదని తెలుస్తున్నారు. ఇలా తలచేవారిసంఖ్య చాలా హెచ్చు. బందిపోట్లు జరిగినప్పుడు ముస్లిములు తమ పొరుగున వున్న హిందువులకు సహాయం చేస్తున్నారని వీరు అంటున్నారు. మూడో తరగతివారు, పాకిస్థానునుంచి తాము వెళిపోవడం సాధ్యంకాకపోవడంవల్ల యెట్టి పరిస్థితులలో నైనాసరే తాము పాకిస్థానులో జీవించక తప్పదని తలుస్తున్నారు' అని మెహతాగారు వివరించారు.

మెహతాగారు తూర్పు పాకిస్థానులో పర్యటించి, అధికారులను, అనధికారులను కలుసుకొని మాట్లాడారు. తన భావాలను పత్రికా ప్రతినిధుల సభలో వివరిస్తూ ఆయన ఇలా అన్నారు: 'తూ. పాకిస్థానులో పరిస్థితులు కొంతవరకు చక్కబడ్డాయి. అధికారులు ఆశాజనకమైన హామీలు యిచ్చారు. ఈ హామీలు కార్యరూపం దాలుస్తనా? అనేవిషయం చూడాల్సివున్నది.

### ప్యాస్‌పోర్టులవల్ల కలుగుతున్న కష్టాలు

నేను చాలామంది అనధికారులతో మాట్లాడాను. ఈ సంభాషణలలో ప్యాస్‌పోర్టు పద్ధతి, వీసాపద్ధతి అమితమైన ప్రాముఖ్యం వహించాయి. ఈ పద్ధతివల్ల ఉభయ బెంగాలుల మధ్య ప్రయాణాలు చాలా అలక్ష్యమవుతున్నవని వారు అన్నారు. ఈ పద్ధతి వారికి కోపకారణము, దుఃఖకారణము అయింది.

ప్యాస్‌పోర్టు పద్ధతిని ప్రవేశపెట్టిన తరువాత 6 వేల కుటుంబాలకు వలస వెళ్లినాని అనుమతించే పత్రాలు యిచ్చారు. ఫిబ్రవరి అంతంవరకు 18 వేల మంది పశ్చిమ బెంగాలుకు వలస వచ్చారు. ఇంకా చాలామంది అసామకు, త్రిపురాకు వలసవెళ్లారు.

ఎగుమతులపై పాకిస్థాను భారమైన పన్ను విధించడంవల్ల సరిహద్దువాణిజ్యం దెబ్బతింటున్నది. ఉభయప్రభుత్వాలు చర్చించడంవల్ల సరిహద్దు వాణిజ్యం వృద్ధిఅవుతుందని నా అభిప్రాయము. విభజనకు పూర్వము అసామ్ త్రిపురాలకున్నూ తూ. బెంగాలుకున్నూ మధ్య ఆర్థికసంబంధాలు బహుసన్నిహితంగా వుండేవి. ఎగుమతిపన్ను విపరీతంగా వుండడంవల్ల వాణిజ్యానికి దెబ్బ తగిలింది. ఉభయప్రభుత్వాలూ చర్చల మూలకంగా ఈ వాణిజ్యాన్ని అభివృద్ధి చేయవచ్చు.'

# అసెంబ్లీ ఉప ఎన్నికలలో పోటీ చేయకూడదని ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ నిర్ణయం

మద్రాసు, మార్చి 23: ఆంధ్ర రాష్ట్ర సమస్యపై రాజీనామాలవల్ల ఖాళీలు ఏర్పడిన అసెంబ్లీ స్థానాలకు పోటీ పెట్టకూడదని ఆంధ్రకమ్యూనిస్టు పార్టీ తీర్మానించింది. మొన్నటినుంచి యిక్కడ ప్రారంభమైన రాష్ట్రకమిటీ సమావేశంలో శ్రీయుతులు చండ్ర రాజేశ్వరరావు, యం. చంద్రశేఖరరావు, టి. సత్యనారాయణ, వై. వి. కృష్ణరావు, కే. యల్. నరసింహం, టి. నాగిరెడ్డి, పిల్లలమర్రి వెంకటేశ్వరులు, యం. హనుమంతరావు పాల్గొన్నారు. ఈ సమావేశంలో ఆంధ్ర రాష్ట్ర సమస్యగురించి అసెంబ్లీ ఉప ఎన్నికలు గురించి చర్చజరిగింది. కమిటీవారు యీక్రింది తీర్మానం గావించారు:

ఆంధ్ర రాష్ట్ర సత్వర నిర్మాణము సాధించటానికి ప్రారంభమైన ప్రజా ఉద్యమం విషయంలో కమ్యూనిస్టు పార్టీవారు కమ్యూనిస్టు శాసన సభ్యులు శ్రద్ధతో పనిచేస్తూ యీ ఉద్యమం సందర్భంలో ప్రాణాహుతి చేసిన శ్రీ పొట్టి శ్రీరాములుగారి నిరాహారదీక్ష యెడల కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరించిన వైఖరిని ఖండించినారు. కమ్యూనిస్టు పార్టీవారు యీ ఆందోళనమునందు సరియైన పద్ధతినే అనుసరించినది అయితే కొందరు యితర పార్టీల సభ్యులు ప్రభుత్వ వైఖరిపట్ల అసమ్మతి సూచకముగా తమ సభ్యత్వాలకు రాజీనామాలిచ్చారు. ఈ కమిటీ వారు ఆ యితర పార్టీల సభ్యులు అనుసరించిన మార్గము సరియైనదని విశ్వసించకపోయినా, వారు ప్రభుత్వం పై ఖరిపట్ల నిరసనను తెలుపుటకే రాజీనామానిచ్చియుండుటచేత వారికి కమ్యూనిస్టుపార్టీ పోటీపెట్టకుండుటకు నిశ్చయించియున్నది. ప్రభుత్వము వారు అనుసరిస్తున్న ప్రజా ప్రతికూల విధానాన్ని యీ సభ్యులు తిరిగి ఎన్నికైన తరువాత కూడా ప్రతిఘటిస్తూ ఉండగలరని వారు కాంగ్రెస్ పార్టీతో చేరిపోకుండా ఉంటారని ఆశిస్తున్నాము.

